


శ్రీ విక్టోరియా మహారాణిగారు

**Queen Victoria**

సంపుటము 3] డిసెంబరు 1916 [సంచిక 6

# బాలమిత్ర



## చిత్రమైన పురిటిమంచము

చిన్నపిల్లలారా! మీ యిండ్లలో పసిపిల్ల లున్నారా? చిన్నతనమున వారు పుట్టగానే ఎక్కడ నుంచెదరు? మంచము మీదగదా? ఎంత బీదవారైనను బిడ్డ పసిగానున్నప్పుడు కుక్కిమంచమైనా సంపాదించుకొని దానిలో తమబిడ్డ నుంతురు. నేనిప్పుడు మీకు చాల చిత్రమైన పురిటిమంచమునుగూర్చి చెప్పెదను.

చాలవందల సంవత్సరముల క్రిందట రాజవంశములో చేరినవాడొకడు పనిమీద తన భార్యతోగూడ ఒక గ్రామము వెళ్లెను. ప్రొద్దు గ్రుంకు వేళకు ఆయూరు చేరెనుగాని అచ్చట కనేకులు వచ్చినందున ఎక్కడకు వెళ్లుటకు తోచకపోయెను. అందులో ఆతనిభార్య ప్రసవించుటకు సిద్ధముగానుండెను. అటునిటు దిరిగి ఒక సత్రము జేరిరిగాని దానినిండ జనులున్నందున, వెనుకనున్న కొట్టములో నాటికి బస జేసిరి.

రాత్రి కొంచెము గడచునప్పటికి ఆయమ్మకు నొప్పు లారంభమై దివ్యసుందరబాలు నొకని గనెను. వాని నెక్కడనుంచుటకు తావులేకపోయెను. తలిదండ్రు లిరువురు రాజవంశస్థులైనను కాలక్రమమున నిట్టి దరిద్రులైరి. ఆతల్లి చాల ఉపాయశాలి. అది చలికాలము, చలిగాలి భోరున కొట్టుచుండెను. కప్పుకొనుటకు తగిన బట్టలైనా లేకుండెను. ఆయునకున్న చింపిరిగుడ్డలు నాలుగు ఆ బాలునికిచుట్టి, అక్కడ పడియున్న ఎండు కసవుకొంత వెదకి చూడగా తల్లికి దగ్గరగా నొక తొట్టి కనుబడెను. కొట్టములోని ఆవులు నీరు త్రాగుటకు దాని నక్కడ నుంచిరి.

ఆమె కొంతగడ్డి నాతొట్టిలో వేయించి, ఆ గడ్డిపోచలు బిడ్డకు గ్రుచ్చుకొనకుండ బాగుగానదిమి, బిడ్డను పాతిగుడ్డలలో చుట్టి దానియందుంచెను. ఇది చిత్రమైన పురిటిమంచము

కాదా? మీలో ఎవరైనను అట్టి రాతితొట్టిలో పరుంటిరా? ఆ బాలుని ముఖముజూచిన వారెల్లరు రాచకళ లున్నవని చెప్పిరి. గాని ఈ దరిద్రస్థితి ఏమి? ఎందుకు కలిగెను.

ప్రియబిడ్డా! ఎందుకో చెప్పెదను వినుము. ఆ చిన్ని బిడ్డ సకలజగత్తును వానిలోని సమస్తమును సృష్టించిన దేవుడు. ఆయన చాలకాలము క్రిందట మనుష్యులను సృజించి వారికి చాల గొప్పతనమిచ్చి, వారిని ప్రేమించెను. వారి హృదయములలో నివసించగోరెను. గాని వారు ఆయనను నిరాకరించి, ఆయన వచ్చినప్పుడు దాగుకొనిరి. చాలకాలమునకు ఆయన మనుష్యుడుగాపుట్టి వారిని వెతుక వచ్చెను. అయితే అంత దరిద్రుడుగాపుట్టి, అట్టి నీచమైన తొట్టిలో నుండుటయేల? ఎవరైన ఒక పసిపిల్ల చీకటిలో చలిచే గడగడ వణకుచు ఏడ్చుచు, వీధిలో బడియున్న యెడల దానినెత్తి తగిన పరామర్శ చేయకుందువా? నీవు ఆయన ఉన్నస్థితినిజూచి కనికరపడి నీయింట ఆయనను చేర్చుకొనుటకు అక్కరడున్నాడు. ఆయన నీ హృదయములో ప్రవేశించుమని అడుగువరకు ఆచల్లని రాతితొట్టిలోనే యుండును. ప్రతి క్రిస్మసురాత్రి నీయొద్ద కాయనావిధముగా వచ్చుచున్నాడు. ఆయన నక్కడనే చలిలోను చీకటిలో నుంచెదవా? పశువులు నీరు త్రాగుతొట్టి చిత్రమైన పురిటి

మంచము కాఁవచ్చును, గాని నీ హృదయములోకి ఆయనను చేర్చుకొన్నయెడల అది మరీ చిత్రమైన పురిటిమంచమగును.

---

# క్రీస్తు పుట్టుక



శ్రీదేవ శ్రీయెహోవా, అను రాగము

ఘనదూతా జనలోలాభు ♦ వనపాలా వరశీలా
వనితసంభవ, బాలా ♦ వినుతులఁ గొనుచాలా

2. మంగళమే పరమునకున్ ♦ మహితాత్మునకుదీన
మనుజావతారునకున్ ♦ మంగళా శోభాకరునకున్

3. జ్ఞానులకైవారములన్ ♦ కనకము సాంబ్రాణియును
గొనియున్న మాన్యుడమా ♦ వినుతులు నీకేపాటి ?

4. అనయమునన్ మిషనను ద ♦ ద్వినయ ప్రభక్తుల శ్రేణిన్
ఎనలేని నెనరుల దీ ♦ వెనలను బోషింపుప్రభో.

---

# ప్రియ అవ్వగారు

ప్రియ బాలమిత్రులారా!

మొదటి పుటమీదనున్న దెవరిపటమో తెలియునా? ఆమె మన జార్జి రాజుగారి అవ్వ. ఆమె పేరు విక్టోరియా మహారాణిగారు. ఆమె 1819 సం॥ మే నెల 24 వ తేదీన పుట్టిరి. ఇంక రెండు సంవత్సరములలో నూరు సంవత్సరము లగును. ఇంగ్లాండు దేశమును పరిపాలించిన రాణులలో నీమె కంటె గొప్పవారెవ్వరును లేరు. ఆమె బాల్యమునుండియు మరణమగు వరకును జాలి, ప్రేమ, దయ మొదలగు సుగుణములే ఆమెయందు కనుపడెను. ఆ చరిత్రను సాంతముగా జదివిన వారామెయెడల గౌరవమును జూపక

మానరు. ఇంగ్లాండు మొదలగు దేశములలోని వారును హిందూదేశీయులును ఆమెను బహుగా కొనియాడుచున్నారు.

ఆమె చిన్న శిశువుగానుండు కాలముననే రెండు మరణ గండములనుండి తప్పించుకొనెను. పిట్టలను వేటాడుచున్న యొక బాలుని తుపాకినుండి విడువబడిన గుండు ఈమె నెత్తి మీదుగా బోయెను. మరియొకసారి ఈమె షికారు పోవుచుండగా గుర్రము బెదరి యెగిరినందున, బండియందు కూర్చున్న ఈమె ఎగిరి గుర్రపు కాళ్లసందున బడెను. దగ్గరనున్న సిఫాయి యొక డామెను తీసియుండని యెడల చనిపోయి యుండును.

ఆమె తల్లిగారు ఆమె విద్యావిషయములనుగూర్చి బహు శ్రద్ధ బూనుకొనిరి. ఎన్నడైనను జీర్ణముకాని వస్తువులను పెట్టలేదు. ప్రతి పనికితగిన కాలము నేర్పరచెను. మనస్సున కెన్నడు తొందర కలిగించలేదు. ప్రతి తల్లియు తన బిడ్డల కిట్టి సంగతులను చిన్నతనములోనే పట్టించిన యెడల ఎంతో మేలు గలుగును. విక్టోరియమ్మ తన చిరుత ప్రాయముననే అనేక సంగతులను నేర్చుకొనెను. అన్నిటికంటె బైబిలు చదువుటయు, దానిలోని బోధలు నేర్చుకొనుటయు ఆమెకు మిగుల ప్రియమైయుండెను. ప్రకృతిశాస్త్రములన్న నామెకు

మిగుల ప్రీతి వాటన్నిటియందు వృక్షశాస్త్రమునం దామె కెంతో యభిరుచియుట.

ఈమె రాజ్యమునకు వచ్చునను సంగతి లోకమునకు తెలిసియుండినను ఈమెకు మాత్రము చాలకాలము వరకు తెలియనీయకుండిరి. గాని రాజ్యమేలువారికి కావలసిన నన్ని యును నేర్పిరి. 1837 సంవత్సరమున ఈమె ఆంగ్లేయరాజ్య మునకు రాణియాయెను. ఈమె పినతండ్రియగు నాలవ విలియము మరణమాయెను. రాత్రియందు మిగుల గాఢ నిద్రావేశురాలయిన విక్టోరియాను లేపి రాజ్య సింహాసనమున కూర్చుండబెట్టుటకై ప్రధాన మంత్రియు, ప్రధాన మతగురు వును వెళ్లిరి. రాజ్యము తనకు వచ్చినదని వినినప్పుడు పదునెనిమి దేండ్ల ప్రాయము మాత్రమే గలిగియున్న విక్టోరియారాణి యేడ్చెనట. అబలయగు తన భుజములపై పెట్టబడిన ఈగొప్ప భారము నెట్లు మోయగలనా యను విచారమామెను కలత పెట్టెను. ఎట్టి వినయము, ఎట్టి సుగుణము బాల్యమున నే ఆమెకు కలిగినది! బిడ్డలారా! మీరేమి తలంచుచున్నారు? మీ తలిదండ్రుల ఆస్థి మీకు వచ్చునని నమ్మకము కలిగినప్పుడు మీరేమి చెప్పెదరు? విక్టోరియారాణిని దలంచుకొనుడు.

1840 సం॥ ఫిబ్రవరి నెలలో నామెకు వివాహము జరిగెను. ఆల్బర్టుప్రభువుగా రామెను వివాహమాడిరి. ఆమె

గొప్ప దేశమునకు రాణియైనను తన భర్తను గౌరవించి ఆయ నను సన్మానించకపోలేదు. వారికి 5 గురు కుమార్తెలును, నలుగురు కుమారులును గలిగిరి. వారిలో నిప్పుడు కన్నాటు ప్రభువు మాత్రము జీవించియున్నారు.

ఈమె రాజరికమున మన దేశమునకు గలిగిన మేళ్లిన్నని జెప్ప నలవికాదు. ప్రస్తుతము మన మనుభవించుచున్న మేలు లన్నియు నామెచే నారంభింపబడినవే.

ఈమె చరిత్రము జదివిన వారందరు ఈమెవలె సత్య ప్రియులును, పరోపకార చింతగలవారును, వినయవివేక సంపన్నులును, నిగర్వులును అన్నిటికంటె విశేషముగా ఈమెవలె భక్తిగలవారును కావలెనని కోరుచున్నాము. అట్టి సహాయము దేవుడు అనుగ్రహించును గాక!

---

## రాజుగారి కీర్తన

రా॥ కాంభోజి తా॥ ఆది

దేవ మా రాజును - దేవ మా రాణినిఁ =

గావుము నీదయ - ఘనముగఁ జూపించియు ॥



1. పెంచుము నీకృప - నుంచుము వీరికి =
పంచుము నీదయ - బాగుగ నిరతము ॥ దేవ ॥

2. ఎక్కువ కాలము - చేక్కఁగా మష్మేలను =
మిక్కిలి దీవించుచు - మక్కువఁ జూపించవే ॥ దేవ ॥

3. వీరికిఁగల వైరులఁ - బారఁగఁ దోలియు =
సారెకు నీదాపుకుఁ - జేరఁగఁ దీయవే ॥ దేవ ॥

4. ఉండఁగఁ వీరికి - దండి నీ సత్కృపను =
మెండుగ దయచేయను - మేదిని వేడెదము ॥ దేవ ॥

---

రాజులకొరకును అధికారు లందరికొరకును విజ్ఞాపనములును ప్రార్థనలును యాచనలును కృతజ్ఞతా స్తుతులును చేయవలెను.

# క్రిస్మస్ అతిథి



ఒక యూరిలో నొక బీద కుటుంబముండెను. వారు క్రీస్తు జన్మదినోత్సవమున నొక క్రిస్మస్ చెట్టు సిద్ధముచేయ గోరి, సమీపమున నుండిన యడవినుండి దాని తెచ్చుటకై, తండ్రి బిడ్డలు వెళ్లియుండిరి. అక్కడ నొక మంచి కొమ్మను కనుగొని, గృహమునకు గొనిపోవుచుండగా, కుఱ్ఱవాడగు రాజరావు తన చెల్లెలగు రత్నమ్మనుచూచి, ,,ఆ కొమ్మపై

నున్న గూటిని చెక్కివేసెద" ననెను. అందుకాచిన్నది చింతించి 'దాని నక్కడనే యుండనిమ్ము అది యొక చిన్న కంబళి పురుగుయొక్క యిల్లు' అనెను. ఈ కంబళిపురుగు అడవిలో నిటు నటు దిరుగుచు చివరకా కొమ్మను గనుంగొని, శీతకాలము గడుపుట కాయింటిని కట్టుకొనెను. అది సంతసముతో యాగూటిలో బరుండి నిద్రించుచుండెను. ఆ గూడు కిటికీలేమియులేక సన్నని మృదువైన దారములతో నల్లబడియుండెను. కిటికీయుండిన తానాయడవినుండి వేరొకచోటికి బోవుచున్నట్లు గనుంగొని యా చిన్నపురుగెంత చింతించియుండునో! కొన్ని నిమిషములకు పిమ్మట తానొకయింటిలో నుండుటకు, పిమ్మట తనచుట్టు యా కొమ్మపై బొమ్మలుంచబడుటయు జూచిన తానెంత సంతసించునదో! అయితే యా మార్పు లేవియులేక యది హాయిగ నిద్రించుచుండె. చుట్టు నున్న మైనపువత్తులచే నింటిలోని వాయువు వేడియయ్యె. వేసవికాల మేగుదెంచెనని యెంచి యాకంబళి పురువొక రంధ్రముదొలచి యాగూటినుండి బైటికివచ్చి యాకొమ్మ కొనపై నిలుచుండెను. రత్నమ్మ యాగదిలోనికి వచ్చినపుడేమి జూచెను? కంబళిపురుగు కాదు. ఒక చక్కని సీతాకోకచిలుక. "ఆహా! ఎంతచక్కని పిట్ట! అన్నింటిలో నిదే చక్కగాయున్నది. ఆ కిటికీలోనుండి వచ్చియుండును" అని యా

చిన్నదనెను. అది గూటినుండి వచ్చెనని ఆపిల్లలు గ్రహించనే లేదు. అది చిన్నదైనను వారికెంత సంతోషము గలిగించెను! పెద్దవారమగు మనమిందరిని సంతోషపెట్టుచున్నామా?

---

# ప్రకృతి పాఠములు

## 28-వ పాఠము

### మనస్సు సంగతుల నెట్లు తెలిసికొనుచున్నది?

తంతి ఆఫీసు సమాచారముల నంపునట్లు శరీరమందలి భాగములకు మనస్సు సమాచారముల నంపుచున్నదని ఇదివరకు తెలిసికొంటిమి. ఇట్టి సమాచారములను తెచ్చునవి నాడులు. మనస్సు నిరంతరము చేతుల వ్రేళ్లనుండి కండ్లు, ముక్కు, చెవులు, నోరు మొదలగు యితరావయవములనుండియు ఈ కబురులను తెలిసికొనుచున్నది. చుట్టు ప్రక్కలనున్న సమాచారముల నది ఈ ఉపకరణముల సహాయమున తెలిసికొనుచున్నది. వేరువేరు సాధనముల ద్వారా వేరువేరు సంగతులను మనస్సునకు పోవుచున్నవి. వ్రేళ్లతో తాకుటవలన మెత్తగానున్నదో గట్టిగానున్నదో తెలియును. ఎట్టి రుచియున్నది నోరు తెలుపును.

ఇట్టి సమాచారములను తెలుపునది నాడులే. నాడులు లేనియెడల మెదడు పెట్టెయందుంచి మూయబడిన వస్తువు వలె నిష్ప్రయోజనమగును. చుట్టుపట్ల జరుగు దేనిని తెలిసికొనజాలదు. కండ్లు, నాలుక, చెవి మొదలగునవెన్ని యున్నను లాభమేలేదు.

చిన్నపిల్లలెట్లు సంగతులను నేర్చుకొనుచున్నారో గమనించుడి. పుట్టినప్పుడు వారికేమైనను తెలియునా? క్రమక్రమముగా వాని యింద్రియముల ద్వారా మనస్సునకు వర్తమానములు నడుపబడును. మొదట యింటియందున్న వాటిని తరువాత బయటనుజూచి విని నేర్చుకొనును. తరువాత మనస్సు తలంచుటకారంభించును. కొందరిలో తలంచు గుణము ఎక్కువలేదు. అనేకసంగతులను చూచుచు వినుచు నుందురుగాని వాటినిగురించి తెలిసికొనరు.

మనస్సుకు ఈ సంగతులన్నియు చూచుట, వినుట, తాకుట వాసనచూచుట, రుచిచూచుట మొదలగువాని ద్వారా వచ్చునని తెలిసికొంటిమి. ఈవిధములలో కొన్ని కొందరికి లేవు. కొందరు చెవిటివారు. కొందరు గ్రుడ్డివారు గలరు. వారికి చెవులున్నవి. వారి మనస్సు చాలసంగతులు తెలిసికొనుటకు సిద్ధముగా నున్నను సమాచారములను తీసికొనిపోవు నాడులు చెడినందున వినలేరు. కండ్లున్నను,

ద్వారము మూయబడినందున, వారి సాధులు చురుకుగా పనిచేయుచున్నను వారు చూచి తెలిసికొనలేరు.

---

# మొదటి క్రిస్మసు

క్రీస్తు పుట్టినతరువాత యెంతకాలమునుండి జనులు ఆయన పుట్టుకదినమును ఆచరించ మొదలుబెట్టిరి? ఆయన జీవించినకాలమందు పుట్టుకదినమును యెప్పుడైన ఆచరించిరా?

క్రీస్తు తరువాత 98 వ సంవత్సరములో మొదటి క్రిస్మసు ఆచరించబడెననియు, క్రీస్తు తరువాత 137 వ సంవత్సరములో టెలస్పోరస్పోపుగారివలన ఒక గంభీరమైన విందుగా నాచరింపబడున ట్లాజ్ఞాపింపబడెననియు పారంపర సంప్రదాయము చెప్పుచున్నది. క్రీస్తు తరువాత 140 వ సంవత్సరములో క్రిస్మసుయొక్క కొన్ని ఆచారములు కనుగొనబడెను. దీనిని మొదట యెవరు ఆచరించిరో, యెక్కడ ఆచరించిరో, యెట్లు ఆచరించిరో తెలియదు. ఆది క్రైస్తవులు పుట్టుకదినమును ఆచరించుట అన్యాచారముగా నెంచినందున క్రీస్తు పుట్టుకదినమును ఆయన జీవితకాలములో ఆచరించబడెనని చెప్పుటకు వీలులేదు.

---

# బాలమిత్ర టపా




ప్రియ స్నేహితులారా!

మా స్కూలులో విద్యాగరపు మేమందరము 130 మందిమి. మేము ప్రతిదినము ఉదయము, సాయంత్రము, ఆత్మీయమైన దైవ ఆరాధనతోను, సత్యవేదపాఠముతోను, ఆరంభించుచు విద్య నభ్యసించువారము. 30 జూలై ఆదివారం రోజున, బాలికాబడిలో, మా చిన్నపిల్లలకూటము బహుశోభితముగా జరిగించినాము. ఈ రోజున స్కూలు అనేకమైన పచ్చని, యెర్రని, ఆకుల పుష్పాలతోను, చిత్ర

పటములతో నుండుటమాత్రము కాక, మన పరిపాలకులగు బ్రిటిషువారి పెద్దజెండాయును మన చక్రవర్తి పంచమ జార్జి సార్వభౌముని చక్కని ప్రతిమయును, మా ముందర పెట్టుకొని కూటము జరిపితిమి. ఇందు పురుషులు, స్త్రీలు, దొరసానమ్మలు గాక, హిందూ, మహమ్మదీయ, బ్రాహ్మణుల బాలురు మేము కలిసి, 200 వందలమందిమి హాజరు అయితిమి. బాలురమే యీవత్తు కూటములో పాలుపుచ్చుకొంటిమి. ప్రోగ్రాము ప్రకారము సంగీతములును, సత్యవేదలేఖనములు ధ్యానించుటతోను జరిపిన తరువాత రాజగీతము పాడితిమి. నాటి సాయంత్రము పైవారివల్ల పిల్లలయొక్క సంరక్షకము, భక్తి, వినయములనుగూర్చి మంచిప్రసంగము చేయబడెను. ఇట్టి ప్రసంగమువల్ల మా బాల బాలికలకు చెప్పశక్యముగాని మేలులభించినది అనుటకు యేసందేహము లేదు. అట్టి సంగతులు సంపూర్ణముగా వివరించుటకు చాల వ్రాత కావలసినందువల్లను, నేను చిన్నవాని నైనందువల్లను, క్లుప్తముగా మా మిత్రులు చదివి మా సిరువంచ బాల బాలికల విషయమై ప్రార్థించ వేడుచున్నాను.

మీ స్నేహితుడు
టి. లాజరు
సిరువంచ, సి. పి.

C. L. S. PRESS, MADRAS—1916